

# ఆత్మషట్కము-4

## శ్రీ శంకరాచార్యులవారు

మత్తో నాన్యత్కించి దత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తుమాయోపక్లృప్తమ్,
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్.

తా॥ అద్దమునందు ప్రతిబింబించిన నగరమువలె ఈ జగత్తు మాయచే ఆత్మస్వరూపుడనైన నాయందు కల్పింపబడినది. అది నాకంటె వేఱుగ ఒకింతైనను లేదు. అద్వయరూపుడనగు నాయందే అది భాసించుచున్నది. కావున వాస్తవముగ నేను జగద్రహితుడనై ఆత్మయే అయి వెలయుచున్నాను.

వ్యాఖ్య :- అద్దమందు ప్రతిబింబించిన జగత్తు అద్దముకంటె వేఱు కాదు. అట్లే ఆత్మయందారోపించబడిన ఈ ప్రపంచము వాస్తవముగ ఆత్మకన్యముగ లేదు. కాబట్టి ఈ జగత్తంతయు తనయందే కల్పింపబడినదని విజ్ఞుడు భావించి, పరప్రాణిపై దయ, కరుణ కలిగి వర్తించుచు, గీతయందు తెలుపబడిన ఆత్మౌపమ్యత్వమను సుగుణమును లెస్సగ సంపాదించి విశ్వాత్ముడై విలసిల్లవలెను. ఆత్మానుభూతి కలవాడై, విశ్వమును మనఃకల్పితముగ నిశ్చయించి, తనయందే అయ్యది భాసించుచున్నట్లు అనుభూతమొనర్చుకొని బ్రహ్మానందయుతుడై విరాజిల్లవలయును.

ఓం



ఓం

# శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీకాళహస్తి

# వేదాంతభేరి

సంస్థాపకులు

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

సంపుటము : 24 ఆగష్టు 1992 సంచిక 8




| | |
|---|---|
| సంవత్సర చందా : | రూ. 30/-లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ-520 002<br>ఫోన్స్ : 61862, 64017, 72433<br>Telex : 0475 362 ANIL Fax : 0866-63017 |
| శాశ్వత చందా : | రూ. 300/-లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి-517 640<br>ఫోన్స్: 2239,2543 STD Code 085 78 |

**చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.**

అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక

## BE FEARLESS : నిర్భయులై యుండుడు!



: ముఖచిత్రము :




# దైవ ప్రార్థన

యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో విభుః.

శైవులు శివుడనియు, వేదాంతులు బ్రహ్మమనియు, బౌద్ధులు బుద్ధుడనియు, ప్రమాణకుశలురగు నైయాయికులు కర్తయనియు, జైనులు అర్హత్ అనియు, మీమాంసకులు కర్మయనియు ఏ సర్వవ్యాపక చైతన్యమును ఉపాసించుచున్నారో, ముల్లోకములకు ప్రభువైన అట్టి పరమాత్మ మాకు వాంఛితఫలమును అనుగ్రహించుగాక!



# వివేకానంద శంఖారావము

"**H**elp, and not Fight",

"Assimilation and not Destruction",

"Harmony and peace, and not Dissension".

సహాయము చేయుము, కలహించ వద్దు;

అభివృద్ధిని సాధింపుము, నాశమొ నర్చకుము;

శాంతి కలిగియుండుము, అశాంతిని కలుగజేయవలదు.

OO



# వేదాంతభేరి



## శాశ్వత సుఖము

### శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



లోకములో ఎన్నియో సుఖములు, లాభములు కలవుకాని అవియన్నియు శరీరముండునంతవరకే. అవి దేహముతో సంబంధము కలిగియున్నవి కావున దేహవియోగముచే వాని వియోగమున్ను సంభవించుచున్నది. విజ్ఞుడగువాడు క్షణిక సుఖములను, తాత్కాలిక లాభములను ఆశింపడు. శాశ్వత సౌఖ్యమునే ఆతడు కోరును. అనంత పరమార్థ లాభమునే ఆతడు కాంక్షించును.

యోగవాసిష్ఠమందు నిర్వాణప్రకరణమున ఒకానొక విద్యాధరుని గూర్చిన గాథ కలదు. ఒక విద్యాధరుడు వేలకొలది సంవత్సరములు రాజ్యమును పరిపాలించి తుట్టతుదకు ఈ ప్రకారముగ తన అనుభవమును వెల్లడించెను.

"ఈ ప్రాపంచిక విషయభోగములన్నిటిని, ఇంద్రియ సుఖములన్నిటిని, ఒక సంవత్సరము కాదు, రెండు సంవత్సరములు కాదు, వేలకొలది సంవత్సరములు అనుభవించితిని. పిపీలికాది బ్రహ్మపర్యంతము గల భోగజాలమునంతను తనివితీర ఉపభోగించితిని. కాని తృప్తి కలుగలేదు. ఇంకను అనుభవించవలెనను కాంక్ష పెరిగిపోవుచున్నది. బహు

కాలము సామ్రాజ్యమునంతను పరిపాలించినను, శత్రుసేనలన్నిటిని పరిమార్చినను అపూర్వమైన వస్తువును దేనిని నేను బడయలేదు. తమకు చావులేకుండ వరములను బొందినవారు, ముల్లోకములను ఏకఛాటిగ పరిపాలించినవారుసుకూడ చివరకు బూడిదలో కలిసిపోయిరి.

కాబట్టి ఏది శాశ్వతమో అట్టి పదార్థమునే నేను పొందవలయును. దేనిని పొందినచో ఇక పొందదగిన వస్తువేదియు మిగిలియుండదో, దేనిని తెలిసికొనినచో ఇక తెలిసికొను వస్తు వెయ్యది శేషించియుండదో అట్టి ఆత్మను గూర్చియే ప్రయత్నపూర్వకముగ నేను అన్వేషించవలెను.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్య [illegible]
[illegible]

ఎన్ని కష్టములకోర్చియైనను, ఎన్ని ప్రయాసలనెదుర్కొనియైనను ఆత్మనే జీవుడు పొందవలెను. అట్టి ఆత్మనే జీవితాంతములోగా అతడు సాక్షాత్కరించుకొనవలెను.

విద్యాధరుని ఈ వాక్యములు ముముక్షువులకు శిరోధార్యములు. అవశ్యమాచరణీయములు. ఎన్ని వేల సంవత్సరములో రాజ్యమును పరిపాలించి, ఎన్ని సుఖములనో అనుభవించి అనుభవించి తుదకు వానిలో సారము లేదనియు, సారభూతమైనది శాశ్వత సచ్చిదానంద పరమాత్మయే యనియు అతడు చెప్పిన వాక్యములు ఎంతయో విలువగలిగినవైయున్నవి. కాబట్టి అన్ని లాభములకంటె గొప్పలాభము పరమార్థ లాభమేయని స్పష్టపడుచున్నది.

పూజ చేయునపుడు ఈ క్రింది శ్లోకమును జనులు పఠించుచుందురు—

[illegible]
[illegible]

ఎవరు తమ హృదయమునందు జనార్దనుడగు పరమాత్మను ప్రతిష్ఠించుకొందురో అట్టివారికి లాభము, జయము, సత్కీర్తి లభించును. భగవంతునియందు మనస్సు సంలగ్నమగుటయే జీవునకు మహాలాభము. దైవలాభమునకు మించిన లాభము ఈ ప్రపంచమున మఱేది కలదు?

సంజయులవారు గీతాబోధను సమాప్తముచేయుచు ఒక్క శ్లోకములో గీతా సారమునంతను ఇవ్విధముగ తెలియజేసిరి—

ఎచట యోగీశ్వరుడగు శ్రీకృష్ణ పరమాత్మయొక్క ఉనికి యుండునో, ఎచట భక్తుడగు అర్జునునియొక్క ఉనికి సంభవించునో అచట ఐశ్వర్యము, విజయము, సంపదలు, నీతి మొదలగునవియన్నియు వచ్చి చేరును. కాబట్టి భగవత్సాన్నిధ్యము అన్ని సంపదలకు, అన్ని ఐశ్వర్యములకు మూలమైయున్నది.

ఒక భక్తుడు తన మనస్సును ఈ ప్రకారముగ సంబోధించియున్నాడు—

"ఓ మనస్సా! నీవు నీ చపలత్వమును విడనాడి ఒక త్రాసును తెచ్చి అందలి ఒక పళ్ళెమునందు ప్రపంచంలోగల సమస్త విషయములను పెట్టుము. మఱియొక పళ్ళెమందు పరమాత్మను పెట్టి తూచుము. ఏది బరువుగానుండునో, ఏది చేవగలిగియుండునో, ఏది అతులిత ఆనందము నొసంగునో, దేనియందు పరిపూర్ణ విశ్రాంతి నీకు లభించునో, దానిని నీవు యుక్తిచేతను, స్వానుభవముచేతను బాగుగ తెలిసికొని అట్టి ఆనంద ప్రదమగు పరమాత్మనే ఆశ్రయించి జన్మను కడతేర్చుకొనుము"

కాబట్టి జనులు ఒకింత వివేకము నాశ్రయించి ప్రపంచములో సార భూతమైన వస్తు వెయ్యదియో చక్కగ గ్రహించి, అన్నిలాభములకంటె గొప్ప లాభమేదియో మహాత్ముల ముఖతః తెలిసికొని, శాస్త్ర వాక్యము లచే అద్దానిని పరిపోషించుకొని, స్వానుభవముచే అద్దానిని దృఢపరచు కొని అట్టి ఆత్మరూప శాశ్వత సుఖమునే పరమార్థ లాభమునే పడసి జీవిత మును కృతార్థమొనర్చుకొందురుగాక! ○○

# గ్రంథంవంటి జీవితం

## శ్రీ అడపా రామకృష్ణ గారు (విశాఖపట్నం)

ఓ మానవుడా!
ఈ జీవితం ఓ గ్రంథం
పుటలు త్రిప్పుతున్నకొలది
ముగింపు అయిపోవస్తోంది
గ్రంథం అంతా రుచి చూడనిదే
చేదు వగరు గమనింపనిదే
జీవితంలో అనుభవాలుండవులే
అంతా తరచి చూడనిదే
కారుమబ్బులేవో
వెలుగుజిలుగులేవో- ఏమిటో
అర్థంకాని అవస్థ నీది
అందులో రసమయభావాలే
నీ జీవన ముక్తిమార్గాలు లే
ముఖచిత్రపు పై మెరుగులే
బ్రతుకులో భవితవ్యాన్ని చూపేది
గ్రంథపఠన ముగిసిందంటే
జీవితంలో పొందే వివిధ దశలు
సమాధిలో ముగింపజేస్తుంది మరి.

• • •

వ్యవధి మించిపోలేదులే
బ్రతుకు పర్యవసానమేమిటో
పరీక్షించి పరిశీలించుకో
గతించిన కాలాన్ని మరచిపో
అనుభవించిన ఆవేదన వీడిపో
భవిష్యత్తులో భవితవ్యాన్ని వెదుకు
మోక్షమార్గానికే యత్నించు
జీవితాన్ని సుఖమయంగా
భక్తిభావాలతో తీర్చిదిద్దుకో!!

○○

**Infinite pleasure cannot be got thro**

**ఇంద్రియముల ద్వారా అనంతసుఖము పొందబడజాలదు. (ఆత్మస్థితియందే అట్టి సుఖము కలదు).**

వేదాంతభేరి

# ధర్మం శరణం గచ్ఛామి

## బాలిక కథ

### శ్రీ బోధచైతన్య గారు

ఆళవి దేశంలో బుద్ధుడు సంచారం చేస్తూ ఒక గ్రామంలో ధర్మప్రవచనం చేశాడు. అది ఒక కుగ్రామం. ఆ గ్రామంలో అందరూ పద్మశాలీలు. చిన్నలు పెద్దలు అందరూ ప్రవచనం వినడానికి వచ్చారు.

అన్నిచోట్ల ప్రసంగించినట్లే అక్కడ కూడా ప్రసంగిస్తూ జన్మ, మరణం, దుఃఖం, నిర్వాణం- ఇలాంటి విషయాలను చక్కగా పసిపిల్లలకు కూడా అర్థమయ్యే రీతిలో వివరించాడు బుద్ధుడు. అక్కడున్న శ్రోతలు ఎందరు ఆ విషయాలను పట్టుకోగలిగారో తెలియదుగానీ పదేండ్ల బాలిక సునీత చక్కగా విషయాలను గ్రహించింది. ప్రవచనం ముగిశాక అందరూ బుద్ధుని పాదాలకు నమస్కరించి వెళ్తుంటే తాను కూడా అలానే నమస్కరించింది. "నీ పేరేమిటమ్మా" అని బుద్ధుడు ఆమెను పలకరించి పరిశీలనగా చూశాడు. కొంచెం బిడియంగానే పేరు చెప్పింది.

"మంచి పేరే. చూడమ్మా. మళ్ళీ మీ ఊరికి ఎప్పుడొస్తానో నాకు తెలియదు. ఇప్పుడు నీవు విన్న విషయాలను బాగా ఆలోచన చేస్తూ వుండు. ఏ పని చేస్తున్నాసరే ప్రతిక్షణం ఈ విషయాలమీద చింతన చేస్తూ వుండు. మళ్ళీ నేనిక్కడికి రావడం జరిగితే కొన్ని ప్రశ్నలు నిన్నడుగుతాను. ఇప్పుడు పేరేమిటి? అని అడిగితే ఎలా బదులిచ్చావో అలానే ఆ ప్రశ్నలకు కూడా బదులు చెప్పాలి. జ్ఞాపకం పెట్టుకొంటావా?" బుద్ధుడిలా ఆ చిన్నపిల్లను ఇంతసేపు పలకరించడం అందరికీ విడ్డూరమనిపించింది.

దూదినుండి ఏకులు చేస్తున్నా, ఏకులనుండి దారం తీస్తున్నా, దారాలను వస్త్రంగా అల్లుతున్నా ఆ బాలిక బుద్ధుని ప్రవచన విషయాల చింతన మరచిపోలేదు.

మూడేండ్ల తరువాత మళ్లీ బుద్ధుడు ఆ గ్రామానికి రావడం జరిగింది. ప్రవచనం అయ్యాక శ్రోతలు ఒక్కొక్కరూ నమస్కరించి వెళ్తున్నారు. సునీత కూడా నమస్కరించింది. బుద్ధుడు ఆ బాలికను గుర్తుపట్టాడు. ప్రశ్నల విషయం జ్ఞాపకం

చేశాడు. "అడగండి చెబుతాను" అని సునీత సమాధానమిచ్చింది.

**నీవెక్కడనుండి వచ్చావు?**

**నాకు తెలియదు.**

**నీవెక్కడికి వెళ్తున్నావు?**

**నాకు తెలియదు.**

**నీకు తెలియదా?**

**తెలియకేం తెలుసు.**

**నీకు తెలుసా?**

**నాకు తెలియదు.**

ఈ ప్రశ్న జవాబుల మర్మం అక్కడెవ్వరికీ అర్థం కాలేదు. బుద్ధుడేమడిగాడో ఏమోగానీ ఆ పిల్ల అలా తలబిరుసుతనంగా జవాబులివ్వడం బాగా లేదని అక్కడి శ్రోతలనుకొన్నారు.

"నీ జవాబులు ఇక్కడివాళ్ళకు అర్థమయ్యేలా వివరించి చెప్పమ్మా" అన్నాడు బుద్ధుడు. "నేను ఇంటినుండి వచ్చిన సంగతి మీకు తెలుసు. మీ ప్రశ్న దానికి సంబంధించినదిగా వుండదు. ఏ పూర్వజన్మనుండి వచ్చావో తెలుసా అని మీ ప్రశ్నకు అర్థం. తెలియదని జవాబిచ్చాను. నీవెక్కడికి వెళ్తున్నావని మీరడిగారు. అంటే భవిష్యజ్జన్మ విషయమడిగారు తెలియదన్నాను.

నీకు తెలియదా? అని మళ్ళీ ప్రశ్నించారు. మరణం అనేది నిశ్చయం అని తెలియదా అని మీ ప్రశ్నకు అర్థం చెప్పుకుని మరణమనేది నిశ్చయమే నాకు తెలుసు అని జవాబిచ్చాను. నీకు తెలుసా? అని మళ్ళీ అడిగారు. ఎప్పుడు ఎక్కడ అనే విషయం నీకు తెలుసా అని మీరడిగినట్లుగా అర్థం చేసుకొని తెలియదు అన్నాను" అని సునీత వివరణ ఇచ్చింది.

"సంసారమనే వలనుండి బైటపడి నిర్వాణమనే గగనంలో విహరిస్తున్న శకుంత పక్షిలాంటిదానివమ్మా నీవు" అని బుద్ధుడు ఆ బాలికను ప్రశంసించి క్రింది శ్లోకం పఠించాడు.

(ధర్మపదం 13-8)

వలలో చిక్కుకుపోయిన పక్షులు ఎక్కువ. తప్పించుకొన్నవి తక్కువ. అలాగే ప్రజల్లో గ్రుడ్డివాళ్లు ఎక్కువ. చూపు వున్నవాళ్ళు తక్కువ. చూపు వున్నవాడు నిర్వాణపురం చేరగలడు.

OO



శంఖచక్ర పీతాంబరధారీ
కరుణాసాగర కృష్ణ మురారీ
కృష్ణమురారీ కేశవమురారీ
మాధవ మధుసూదన మురారీ॥

హర ఓం హర ఓం హర హర ఓమ్
శివ ఓం శివ ఓం శివ శివ ఓమ్
భవ ఓం భవ ఓం భవభవ ఓమ్
శంభు ఓం శంభు ఓం శంభు శంభు ఓమ్
రుద్ర ఓం రుద్ర ఓం రుద్ర రుద్ర ఓమ్
శర్వ ఓం శర్వ ఓం శర్వ శర్వ ఓమ్॥

గోపాలా గోపాలా । గోకులనందన గోపాలా
నందకుమారా గోపాలా । నవనీతచోరా గోపాలా
ఆపద్బాంధవ గోపాలా । అఖిలాధారా గోపాలా ○○

ఓం

మోక్షమార్గము (One way traffic) ఒకవైపు ప్రయాణము వంటిది. మోక్షధామము చేరినవారు తిరిగిరారు. (యద్గత్వా నవివర్తన్తే)

# ఉపనిషచ్చంద్రిక

## ఈశావాస్యోపనిషత్తు

**యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి**

**సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే.**

"ఎవడు సమస్త ప్రాణికోట్లను ఆత్మయగు తనయందే కాంచునో, మఱియు సమస్త ప్రాణులందును ఆత్మయగు తనను గాంచునో, అట్టివాడిక ఎవనిని నిందింపడు, ద్వేషింపడు"

ఒకడు ఆత్మానుభవమును పొందెనా లేదా, జీవన్ముక్తుడయ్యెనా, లేదా యని తెలిసికొనుటకు ఈ యుపనిషన్మంత్రమునందు చక్కని గుఱుతు యొకటి చెప్పబడినది. సమస్త ప్రాణులను తనయందును (తన ఆత్మయందును), తన యందు సమస్త ప్రాణులను వీక్షించు మహనీయుడు ఎవనిని ఏమియు ద్వేషింపడు, నిందింపడు. తిరస్కరింపడు, నీచముగా జూడడు. ఇదియే **బ్రహ్మానుభూతికి సరియైన లక్షణము.** ఒకడు వాచా వేదాంతియో, అనుష్ఠాన వేదాంతియో ఈ గుఱుతుబట్టి చెప్పవచ్చును.

నిజమైన యోగి, వేదాంతి, సర్వత్ర తన యాత్మనే కాంచుటవలన ఎవరిని ద్వేషింపడు. సర్వులను తనవలెనే ప్రేమించును. తనకేలాగున సుఖము గలుగవలెనని యుపేక్షించునో అట్లే సర్వులకును సుఖమే కలుగవలెనని యాతడు కోరుచుండును. అదే విధముగ తనకేలాగున దుఃఖము కలుగకూడదని వాంచించుచుండునో, సర్వులకును ఆ ప్రకారముగ దుఃఖము కలుగరాదని భావించుచుండును.

ఆకలిగా నున్నప్పుడు తనకు అన్నము కావలెనని ఏలాగున కోరుకొనునో, అట్లే ఇతరుల యొక్క ఆకలి తీరుటకును వాంఛించుచు అందులకై ఆతడు ప్రయత్నించుచుండును. చలిగా నున్నప్పుడు తనకు కప్పికొనుటకు వస్త్రము నేలాగున గైకొనునో, ఆలాగున ఇతరుల యొక్క చలి బాధను దీర్చుటకును

వస్త్రాదుల నొసంగుచుండును. ఆత్మానుభవముగల మహనీయుల స్వభావమిట్లే యుండును.

శరీరమునకు కాలు, చేయి, కన్ను, ముక్కు, చెవి మున్నగు అనేక అవయవములు కలవు. అవి యన్నియు శరీరధారియైన జీవునకు జెందినవే కాని అన్యములు కావు. వానియందు తనను, తనయందు వానిని యతడు వీక్షించుచుండును. ఇక్కారణముననే ఆ యంగములలో దేనినిగూడ ద్వేషింపడు, బాధింపడు. ఏలననగా ఒకవేళ బాధించినచో తన్ను దాను బాధించుకొనినట్లేయగును. అట్లే విశ్వమంతయు ఒకే ఆత్మస్వరూపము. నామరూపాత్మకమగు ఈ విశ్వమంతయు ఆత్మయందే కల్పింపబడినది. కావున ఆత్మయందే స్థితిగల్గియున్నది. ఈ సత్యమెఱిగియుండుట వలననే జ్ఞానియగువాడు విశ్వమందెవనిని ద్వేషింపకయుండును. సర్వుల యెడ ప్రేమను, దయను, కరుణను వర్షింపుచుండును.

"*సర్వభూత హితేరతాః*"–అని అట్టివారు గీతయందభివర్ణింపబడిరి.

నేడు ప్రపంచమునందు పలుచోట్ల జీవకారుణ్యము, సర్వభూతదయ మున్నగు సద్గుణములు బోధింపబడినప్పటికిని, ఆ సద్గుణములు ఏలగలిగియుండవలెనో కారణము తెలుపబడలేదు. ఒక ప్రాణిని ఏల ద్వేషింపరాదు? వాని యెడల కరుణ యెందులకు గలిగియుండవలెను? మున్నగు ప్రశ్నలకు సరియైన సమాధానము లభించుటలేదు. కాని యుపనిషదాది సచ్ఛాస్త్రములా సిద్ధాంతమును సహేతుకముగ వర్ణించి చెప్పినవి. ఈశావాస్యోపనిషత్తునందలి పై మంత్రమే ఇందులకు తార్కాణము. 'ఓ జీవుడా! సమస్త ప్రాణులందును నీ యాత్మయే యుండుటఁబట్టియు, నీ యాత్మయందే సమస్త ప్రాణులు నుండుటఁబట్టియు, ఒక ప్రాణిని ద్వేషించినచో నిన్ను నీవు ద్వేషించుకొనినట్లేయగు"నని ఆ మంత్రము బోధించుచున్నది.

'*ఆత్మానం యది నిన్దన్తి నిన్దన్తి స్వయమేవహి*'

"ఇతరులయందలి ఆత్మను నీవు నిందించినచో నిన్ను నీవే నిందించుకొనుచున్నావు"– అని శాస్త్రములుద్ఘోషించుచున్నవి. కావున ఇట్టి విశాల భావసూచకములగు ఉపనిషన్మంత్రముల యొక్క అర్థమును బాగుగ మననముజేసి, సర్వభూతదయను అలవఱచుకొని, ప్రపంచమున భిన్నత్వమునందేకత్వమును (unity in diversity) దర్శించుచు, ఒకే ఆత్మను సర్వత్ర వీక్షించుచు, ఆత్మసమ్రాట్టుగా వెలయవలయును. ఇదియే సర్వులయొక్క జీవిత లక్ష్యము. OO

ఏ రంగమందైనను లక్ష్యము చేరువఱకు వెనుకంజవేయగూడదు. కోర్సు పూర్తి అగువరకు విద్యార్థి చదువు నిలుపగూడదు. అట్లే మోక్షము పొందువరకు, ఆత్మసాక్షాత్కారము బడయువఱకు సాధకుడు తన ధ్యానాది ప్రయత్నము, అభ్యాసము నిలుపరాదు. ఏ కొద్దిమందియో గమ్యస్థానము చేరువఱకు తీవ్ర ప్రయత్నమాచరించుదురు. తక్కినవారు అధ్యాత్మరంగమున కొలది దూరమేగి మరల వెనుకకు వచ్చెదురు.

పెళ్లిలో కాశీయాత్ర ఘట్టమొకటి కలదు. పెళ్లి ప్రారంభదినమున పెళ్లి కొడుకు 'ఈ సంసారము, గొడవ నాకెందుకు? కాశీ వెళ్లి, హాయిగా ధ్యానం చేసికొని తరిస్తా' అని నిశ్చయించి కాశీకి బయలుదేరును. అతడు కొద్ది దూరము పోగానే పెళ్లి కూతురు తండ్రి అడ్డుపడి–'ఇంత చిన్న వయస్సులో కాశీ ప్రయాణం, వైరాగ్యం దేనికండీ! లక్షణంగా మా పిల్లను పెళ్లి చేసుకొని గృహస్థ జీవితమును గడుపుచు హాయిగా ఉండరాదా?'–అని ప్రశ్నింప–'మీరు చెప్పినది బాగానే ఉన్నది' అని పలికి వెనుకకు తిరిగివచ్చును. ఇది పెళ్లిలో జరుగు ఒక తంతు.

అట్లే సాధకులు కొందఱు గమ్యస్థానము చేరకనే దారిలోనే నిరుత్సాహముతో వెనుకకు తిరిగివచ్చెదురు. అది మంచిదికాదు. లక్ష్యము చేరువఱకు వెనుకకు మరలరాదు. ఆత్మ సాక్షాత్కారమును బడయువఱకు సాధనను నిలుపరాదు. ఎన్ని అవాంతరములు సంభవించినను ధైర్యముతో ముందుకు సాగిపోవలెను. అట్టి ధీరుడు అచిరకాలములోనే గమ్యస్థానము చేరి జన్మ సార్థకత నొందును. OO

**Live and let live.**

**నీవు హాయిగా బ్రతుకుము. ఇతరులు కూడా అట్లు బ్రతుకుటకు వీలు కల్పించుము.**

# నిర్వాణ షట్కము

మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము నేనుకాదు.

చెవి, నాలుక, ముక్కు, కన్ను నేనుకాను.

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వీ నేనుకాను.

నేను ప్రాణము కాను. పంచవాయువులు కాను. సప్తధాతువులు కాను, పంచకోశములు కాను. వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలను కర్మేంద్రియములు కాను.

1992

నేను పుణ్యము కాను, పాపము కాను, సుఖము కాను, దుఃఖము కాను. మంత్రము కాను. తీర్థము కాను. వేదములు కాను, యజ్ఞములు కాను. భోజనము కాను, భోజ్యవస్తువును కాను. భోక్తను కాను. చిదానంద రూపుడగు శివుడనే నేను, శివుడనే నేను.

న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ
మదో నైవ మే నైవ మాత్సర్య భావః
న ధర్మో న చార్థో న కామో న మోక్షః
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్ 4

నాకు రాగద్వేషములు లేవు. లోభమోహములు లేవు. మదముగాని, మాత్సర్య భావముగాని లేవు. ధర్మ, అర్థ, కామ, మోక్షములు లేవు. చిదానన్ద రూపుడగు శివుడనే నేను, శివుడనే నేను.

న మృత్యుర్న శఙ్కా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మ
న బన్ధుర్న మిత్రం గురుర్నైవ శిష్య
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్ 5

నాకు మృత్యువుకాని, భయముకాని, జాతి భేదములు కాని లేవు. నాకు తల్లి కాని, తండ్రికాని లేరు. నాకు జన్మలేదు. బంధువుకాని, మిత్రుడుకాని, గురువుకాని, శిష్యుడుకానిలేరు. చిదానంద రూపుడగు శివుడనే నేను, శివుడనే నేను.

అహం నిర్వికల్పో నిరాకార రూపో
విభూత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్
నవా బన్ధనం నైవ ముక్తిర్న బన్ధః
చిదానన్ద రూపః శివోఽహం శివోఽహమ్

నేను నిర్వికల్పుడను. నిరాకారస్వరూపుడను. సర్వవ్యాపకుడను. ఇంద్రియము లన్నిటితో నాకెప్పుడును, ఏలాటి సంబంధమును లేదు. నాకు బంధమోక్షములున్ను లేవు. చిదానంద రూపుడగు శివుడనే నేను, శివుడనే నేను.

ఇతి శ్రీ శంకర భగవత్పాద విరచితం నిర్వాణషట్కం సంపూర్ణమ్.

○○

# మహాత్ముల ప్రబోధము

## శ్రీ రమణ మహర్షి

- ముందుగా నీవెవరివో తెల్సుకొనుటకు యత్నించుము. ఊహకందని మాయను తెల్సుకొనుటకై కాలమును, శక్తిని వ్యర్థపరచవద్దు.
- జ్ఞానమార్గమునందు సాధన అనగా 'నేను'ను గూర్చి అన్వేషణయే; అనగా అహం పుట్టిన చోటు వెదకుట. 'నేను' ఎవరో తెలిసికొనుట. సత్యమైన 'నేను' ఒక్కటే కలదు. అది సచ్చిదానంద పరిపూర్ణమైనది. దానిని మరచుటవలననే సమస్త దుఃఖములు, అనర్థములు సంభవించుచున్నవి. దానిని దృఢముగా పట్టుకొన్నపుడు దుఃఖములు, వేదనలు జనులను బాధించలేవు.
- ఆత్మజ్ఞానము మనస్సు యొక్క పరిపక్వతపై ఆధారపడి యుండును. అట్టి ఆత్మజ్ఞానమును బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, సన్న్యాసియైనను ఎవ్వరైనను పొంది మోక్షమును బడయవచ్చును. మోక్షమనునది వేరు వస్తువు కాదు. అది తన స్వరూపమే. మోక్షరూపమగు ఆత్మ ఇప్పుడును ఎప్పుడును జీవుని వాస్తవ స్వరూపమే అయి యున్నది.
- జనులకు తమ యథార్థ స్వరూపమును గూర్చి సరైన అవగాహన లేదు. యుగయుగముల నుండియు వారు దేహముతోను, బుద్ధితోను తాదాత్మ్యమును పొందియున్నారు. కాబట్టి ప్రతివారును ముందుగా తానెవరో చక్కగా విచారించి తన ఆత్మస్వరూపమును లెస్సగా అనుభూతమొనర్చుకొనవలెను. ○○

## వ్యాస ఉవాచ

**సత్యం సత్యం పునః సత్యం భుజ ముత్థాప్యచోచ్యతే**
**న వేదాచ్ఛ పరంశాస్త్రం న దేవః కేశవాత్పరః.**

**చేతులు పైకెత్తి నిజమును చెప్పుచున్నాను. నేను చెప్పునది ముమ్మాటికి నిజము. అది యేదనగా—వేదమును మించిన శాస్త్రములేదు. కేశవుని మించిన దేవుడు లేదు.**

# ఆధ్యాత్మిక  కథలు

## తొందరపాటు తగదు

ఒకానొక మహాపట్టణమందు ఒక ధనిక కుటుంబము కలదు. ఆ కుటుంబమునందు తండ్రి, తల్లి,కొమారుడు, కోడలు మాత్రము కలరు. వ్యాపారమందు గణనీయమైన లాభము పొందుటచే ఆ శ్రీమంతుడు ఎంతయో ఆనందముగ తన జీవితమును గడుపుచుండెను. కొమారుడు విద్యావంతుడు. కొలది కాలము క్రిందటనే అతనికి ఉద్యోగము లభించుట వలన, కుటుంబమంతయు సవ్యముగ నడచుచుండెను. కాలము ఆనంద ముగ గడచుచుండెను.

ఇట్లుండ ఒకనాడా యువకునకు ఒక మోటారు వాహనము కొన వలెనను అభిలాష జనించినది. తండ్రి గారితో ఆ విషయమై అతడు ప్రస్తావించగా వారు అందులకు అంగీకరించిరి. అయితే, సర్వాంగసుందరమైన ఒక కొత్త కారు చాల ఖరీదు కాబట్టి పాతదానిని కొనవలసినదిగా తండ్రి సూచన చేసెను. ఆ సూచన మేరకు కుమారుడు పలుచోట్ల విచారించి తుట్టతుదకు ఒక మంచి 'సెకండు హాండు' కారు నొకదానిని ఖరీదుచేసెను. అది పాతదైనను మంచి కండిషన్‌లోనే ఉండెను. ఒకనాడా యువకుని స్నేహితుడు తన మిత్రుని చూచుటకు వచ్చి ఇంటి ముందుగల ఆ కారును చూచి, ఆశ్చర్యయుతుడై దానిని 'ఎప్పుడు కొంటివి' అని ప్రశ్నించెను.యువకుడు దాని వివరములన్నిటిని పూసగ్రుచ్చినట్లు తెలియజేసెను.

అప్పుడా స్నేహితుడు కారునంతను పరీక్షచేసి 'మిత్రమా ఈ కారులో ముఖ్యమైన అంగమగు స్పీడామీటరు లేదే! మఱి కారు పోవు

నపుడు మీకు వేగము ఎట్లు తెలియగలదు. కారు వేగము తెలిసియుండుట ముఖ్యముకదా! అట్టి ముఖ్యమైన, అత్యవసరమైన పార్టు లేకుండ కారులో ఎట్లు ప్రయాణించుచున్నారు?'- అని అడుగగా అపుడా యువకుడిట్లు జవాబు చెప్పెను-'మిత్రమా! నీవు చెప్పిన విషయము సత్యమైనదే. స్పీడామీటరు చాలా ముఖ్యమైన అంగమేయగును కాని మేము కొన్ని కొండగుర్తులద్వారా కారు వేగమును తెలిసికొనగలము' అని తెలుపగా, ఆ గుర్తులేవియో చెప్పుమని అతడు కోరెను. అపుడు కారు యజమాని ఇట్లు తెలిపెను-

'కారు పోవుచుండునపుడు తలుపులు కొట్టుకొనినచో నలభై మైళ్ల స్పీడు, టాపు అదరినచో అరవై మైళ్ల స్పీడు, బాడీ అంతయు కిట్టుకిట్టు అని శబ్దము చేసినచో డెబ్బై మైళ్ల స్పీడు. చక్రాలు ఊడినచో ఫుల్ స్పీడు-ఈ ప్రకారమగు గుర్తులచే మేము కారు వేగము తెలిసికొనగల్గుదుము'

ఆ మాటలు విని స్నేహితుడు చక్రాలు ఊడిపోయే స్పీడు ఎప్పుడూ పెట్టవద్దని హితవుచెప్పి వెడలిపోయెను.

నీతి : పరమార్థ రంగమున సాధకుడు తన సాధనలను శాంతముగ, గంభీరముగ చేసికొనుచు పోవలెను. త్వరపడరాదు. హడావుడి పనికిరాదు. ఒక్కొక్క సాధనను చక్కగ అభ్యసించుచు ముందుకు కొనసాగిపోవలెను. మితమైన వేగముతో పోయినచో బండి ఎట్లు సురక్షితముగ గమ్యస్థానము చేరగలదో, అధిక వేగముచే ఎట్లు ప్రమాదములు సంభవించునో, అట్లే సాధకుడు తన సాధనలను ప్రశాంతముగ, గంభీరముగ అభ్యసించుచు పోయి మోక్షమను గమ్యస్థానమును సురక్షితముగ చేరవలయును. ○○

**We want great spirit, tremendous energy and boundless enthusiasm.**

**మనకు కావలసింది అఖండశక్తి, అపరిమిత బలము, మహోత్సాహము.**

# సద్గురు సుభాషితములు

## శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు

1. ఒక చెవితో ఉపనిషచ్ఛ్రుతిపాద్య బ్రహ్మమును వినుటయు, రెండవ కర్ణముతో దీనుల దుఃఖాలాప మొఱను విని తన్నివృత్తికొరకు ప్రయత్నించుటయు, ఒక దృష్టితో బ్రహ్మము ననవరతము దర్శించుటయు, రెండవ నయనముతో జనుల తపనమును అవలోకనము చేయుటయు, ఒక చేతితో ఇహపర ధనముల నార్జించుటయు, రెండవ కరముతో లోకమున కిచ్చుటకు ఆతురపడుటయు, ఒక పాదముతో జ్ఞాన విజ్ఞానముల నార్జించుటకు తిరుగుటయు, రెండవ చరణముతో దానిని భక్తులకిచ్చుటకు పరుగెత్తుటయే యథార్థమైన తపస్సనియు, ఋషి మతమనియు, సనాతన ధర్మమనియు మదువకుడు.

2. తుచ్ఛులు తమకు దండిగా నివ్వనిచో పుణ్యాత్ములను, ధర్మాత్ములను, జ్ఞానాత్ములను గూడ దూషించుచుందురు. ఇది యెటువంటిదనగా, నొక బాటసారి ఒక చెట్టు నీడలో గూర్చుండి చెరుకు తిని పిప్పి ఉమ్మిపోయియుం డెను. మరియొక భిక్షగాడు ఆ చెరుకుపిప్పిని తీసి కొన్నిటిని నమలుచుండగ దానియందు రసము లేనందుచే తిని ఉమ్మిపోయిన బాటసారిని తిట్టుచు, కొంచమైన మధురమునుంచక ఈలాగున నీరసముగా జేసినవాడు యెంత చెడ్డవాడుగా నుండునో అని చెప్పేలాగునున్నది.

3. మనస్సును యెల్లప్పుడు ఒకే నిర్మల స్థితిలో నుంచనివారి జప ధ్యాన పూజ భజన యోగాదులన్నియు గజస్నానము వంటివే యగును. ఆ జంతువును ఎంత శుద్ధ ముగా స్నానము చేయించినను, సుందరమైన తిలకమును దిద్దినను వెంటనే మట్టిని దుమ్మును శరీరమంతటను చల్లుకొనును. ఆలాగున జరుగనీయక జిజ్ఞాసువులు, ముముక్షువులు, భక్తులు చూచుకొనుచుండవలయును. లేని కారణముచేతనే కొందరు చిరకాలమునుండి దైవమార్గములో ప్రవర్తించిన వార లయ్యు శుద్ధాత్ములు గాకపోవుటకు కారణమగుచున్నది. కావున ధ్యాన, జప, యోగ, భజన, పూజార్చనాది కాలములో యేలాగున పవిత్రులై యుందురో ఆలాగున యెల్లప్పుడును నుండేలాగున చేసుకొని మనో మాలిన్యమును గలుగ చేసెడి కోప, తాప, అసత్య, మోసపు కృత్యములలోనికి మనస్సును జారనీయః

# ఆత్మానుసంధానము

సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

యథా సూర్య ఏకోఽప్స్వనేకశ్చలాసు
స్థిరా స్వప్యనన్యగ్ని భావ్యస్వరూపః.
చలాసు ప్రభిన్నాసు ధీష్వేవ మేకః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా.

ఆకాశమునందు సూర్యుడొక్కడే వెలుగుచుండినను, కదలుచుండు నీళ్ళల్లో పెక్కులుగా తోచుచున్నదో,

ఏది తాను ఒక్కటే అయియున్నను చంచలమగు బుద్ధులలో అనేకముగ తోచుచున్నదో,

ఏది ఎల్లప్పుడు పొందబడియేయున్నదో అట్టి నిత్యజ్ఞాన స్వరూపమగు ఆత్మయే నేను. OO

---

☞ చూచుచుండవలయును.

4. మంచి చేవగల బలమైన చందన వృక్షాదులు తగరపు కత్తిచే నరికిన యేలాగున తెగజాలవో ఆలాగున సామాన్య బాహ్యభక్తి వేషాదులచే బలమైయుండు చిత్త వృత్తులు తెగజాలవు. ఉక్కుతో చేయబడిన మంచి వాడిగల పెద్ద గొడ్డలిచే యెట్టి వృక్షములైనను ఎడతెగక నరుకగల్గునట్లు తీవ్ర వైరాగ్యబోధోపరతులుగల మనస్సుచేతనే అంతఃకరణ వృత్తులను సమూలోచ్ఛేదనము జేయగల్గును.

5. జనులారా! గమనించవలయును. ఏ వృక్షమునుండి యెక్కువ ఫలములు లభించునో, అది ఫలించుటకు ఎక్కువ కాలము పట్టును. ఏ వృక్షములు త్వరలో ఫలించునో అవి శీఘ్రములోనే నశించునుగదా? దృష్టాంతముగా పనస, మామిడి, కొబ్బరి చెట్లు ఫలమునిచ్చుటకు కాలము అధికము పట్టునుకాని బహుకాలము వరకు ఫలమునిచ్చును. మిరప, వంకాయ చెట్లు త్వరలో ఫలము నిచ్చినను, శీఘ్రకాలములోనే నశించునుగదా? అదే రీతిగా, మీరు శాశ్వత ముక్తి ఫలమునిచ్చెడు మోక్షమనెడి కల్పవృక్షమును పెట్టియున్నారు. కావున దాని ఫలము గల్గిన అనంతకాలము వరకు ఇచ్చుచుండును. కాబట్టి అది ఫలించుటకు కాలమధికముపట్టును. OO

# రావిచెట్టు మహిమ

## ఈశ్వర్

ఈ చరాచర ప్రకృతిలో అణువణువునా భగవంతుని దివ్యశక్తి వ్యాపించి యున్నది.

"ఇందుగలడందులేడను సందేహంబు
వలదు చక్రి సర్వోపగతుండు
ఎందెందు వెదకి చూచిన
అందందే కలడు"

ప్రహ్లాదుని కోరికపై నృసింహమూర్తిగా ఆ పరాత్పరుడు స్తంభమునందు దర్శనమిచ్చెను.

నిప్పు పుల్లలో నిప్పు వున్నను అగ్గిపెట్టె ద్వారా అది బయటబడునట్లే భగవంతుడు సర్వత్రా వ్యాపించియున్నను భక్తుని ప్రార్థనచేతనే బహిర్గతుడై దర్శన మొసంగును.

"చెట్టు, పుట్ట, రాతి, నదుల మొదలగు అన్నిటియందును వ్యాపించి యున్నాను" అని గీత 10వ అధ్యాయములో వివరించియున్నాడు కృష్ణభగవానుడు.

"అశ్వత్థః సర్వవృక్షాణాం"

వృక్షములలో రావిచెట్టుయందు ఎక్కువ శక్తితో వున్నానన్నాడు.

అట్టి రావిచెట్టు మహిమను, గొప్పదనమును గురించి వివరించుకొందాము-

మూలమునందు, శాఖలయందు, స్కంధమునందు, ఆకులయందు, ఫలము లందు సర్వత్రా అచ్యుతుడు సమస్త దేవతలతో కూడియుండును అను విషయము స్కాంద పురాణము చెప్పుచున్నది. రావిచెట్టును విష్ణు స్వరూపముగ చెప్పుదురు కనుకనే రావిచెట్టు విష్ణువుగాను, వేపచెట్టు మహాలక్ష్మిగా భావించి ఒకే

# అమృత బిందువులు

అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠాః గ్రంథిభ్యో ధారిణోవరాః
ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠాః జ్ఞానిభ్యో వ్యవసాయినః

అజ్ఞానులకంటె గ్రంథమును చూచి చదువగలవారు శ్రేష్ఠులు. వారికంటె గ్రంథమును కంఠస్థముచేసినవారు శ్రేష్ఠులు. వారికంటె గ్రంథమందలి అర్థమును తెలిసికొనినవారు శ్రేష్ఠులు. వారికంటె ఆచరించువారు శ్రేష్ఠులు.

శ్రూయతాం శ్రూయతాం [illegible]
గీయతాం గీయతాం నిత్యం హరేర్నామైవ కేవలం.

కేవలము భగవన్నామమును వినుటయందే చెవులను ఉపయోగించవలెను. ఉచ్చరించుటయందే వాక్కును వినియోగించవలెను. సదా భగవన్నామమునే గానము చేయుచుండవలెను.

ంం

పాదులో వేపచెట్టును, రావిచెట్టును పెంచి పెండ్లి చేయుచుందురు. ఇలా చేసి సాక్షాత్ లక్ష్మీనారాయణులకు కల్యాణము చేసినట్లుగ భావించెదరు. రావిచెట్టు ఇంతటి మహిమతో కూడుకొనియున్నది కావుననే దీని పుల్లలను యజ్ఞయాగాదులకు మాత్రమే ఉపయోగించెదరు–ఇతర విధములుగా ఉపయోగించరు.

రావిచెట్టుకు ప్రదక్షిణము చేయుచు ఈ క్రింది మంత్రమును పఠించుటచే శరీర ఆరోగ్యముతోపాటు, మానసిక ఆరోగ్యము కూడా పొందగలరు.

మంత్రము–

మూలతో బ్రహ్మరూపాయ
మధ్యతో విష్ణురూపిణే
అగ్రత శ్శివరూపాయ
వృక్షరాజాయతే నమః

"మూలమందు బ్రహ్మదేవుడు, మధ్యభాగమున విష్ణువు, చివరి భాగమున శివుడు గలిగియున్న ఓ అశ్వత్థ వృక్షరాజమా! నీకు నమస్కారము"– అని ఈ మంత్రము యొక్క అర్థము.

ంం

# ప్రశ్నోత్తర వేదిక

## సందేహాలు - సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.
(తిరుపతి)

ప్రశ్న : నా మిత్రుడంటాడు : "అన్నిటికీ దేవుడు దేవుడంటావు. ఏం చేస్తున్నాడాయన? బాగా పూజలు, పునస్కారాలు అందుకుంటూ కూర్చుంటున్నాడు. మానవుడు చంద్రమండలానికెగిరి వెళ్ళాడు. ఇతర గ్రహాలవరకు పోతున్నాడు. ఎన్నో పనులు సాధించాడు. మనం ఇన్ని ఘనకార్యాలు సాధిస్తుంటే ఎందుకు అన్నింటికీ దేవుణ్ణి పొగుడుతావు. నేను దేవుడిమీద ఆధారపడను. నేనే అన్నీ సాధిస్తాను" అని. అంతేనా? దేవుడేమైనా చేస్తున్నాడా?

జవాబు : మీ మిత్రుడు చాలా పొరపాటుపడుతున్నాడు. దేవుడు ఏమీ చెయ్యకుండా ఉంటే సృష్టే లేదు. రాత్రింబవళ్ళు లేవు. లోకంలో స్వయంగా ప్రకాశించే శక్తి భగవంతునికొక్కడికే ఉంది. మిగతా వస్తువులన్నీ ఆయన వెలుగు వల్ల నామరూపాలను పొందుతున్నాయి. సూర్యుడు లోకాన్ని ప్రకాశింపజేస్తున్నాడు. చంద్రుడు లోకాన్ని ఆహ్లాదపరుస్తున్నాడు, అగ్ని వెలుగును ఇస్తున్నాడు. ఎక్కడిది వారికీ వెలుగు? భగవంతుని ప్రకాశమే వారి ముగ్గురిలో మనం చూస్తున్నాం. ఆయన వెలుగునివ్వకపోతే వారు కూడా స్వయంగా ప్రకాశించలేరు. భూమిలో భగవంతుడు ప్రవేశించి తన శక్తితో ఈ భూతజాలాన్ని మోస్తున్నాడు. లేకపోతే మీ భూగోళం దేనిమీద ఆధారపడి ఉంది? ఇంతమంది జీవులు దీనిపై ఎలా బ్రతుకుతున్నారు? చంద్రుడుగా దేవుడుండి తన కిరణప్రసారం ద్వారా ఓషధులను, వృక్షాలను, సస్యాలను బాగా పెంచుతున్నాడు. అంతవరకెందుకు?

దేవుడు మన శరీరాల్లో జఠరాగ్ని రూపంలో ఉండి ప్రాణాపానాది వాయువులతో కూడి, 1. నమిలి తినవలసిన ఘనపదార్థాలైన భక్ష్యాలు, 2. త్రాగేటువంటి పల్చని ఆహారాలైన భోజ్యాలు, 3. పల్చగా ఉండి చప్పరించి తినవలసిన లేహ్యాలు, 4. రసాన్ని పీల్చవలసిన చోష్యాలనే నాల్గు రకాల ఆహారాలను జీర్ణింపచేస్తున్నాడు. కాబట్టి మనం తినే ఆహారం ఆకలి రూపంలో ఉన్న పరమేశ్వరార్పణంగా తినాలే గాని, 'మనం తింటున్నాం' అనుకుంటూ తినకూడదు. అందుకనే తల్లులు పిల్లలకు 'ఇది రాముడి ముద్ద', 'ఇది కృష్ణుడి ముద్ద' అని దేవుణ్ణి స్మరిస్తూ అన్నం పెట్టడం మనం చూస్తూంటాం. దేవుడు అంతరాత్మగా అన్ని జీవుల హృదయ గుహల్లో ఉన్నాడు. ఆయనవల్లనే జీవులకు స్మరణం, జ్ఞానం, మరచిపోవడం కలుగుతున్నది. వేదాలచే తెలియబడేవాడు దేవుడే. వేదాన్తకర్త, వేదాలను తెలిసికొనేవాడు కూడ భగవంతుడే. అంటే తెలిసికొనేవాడు తెలిసికోబడే వస్తువు, తెలిసికోవడం కూడా భగవంతుడే అని తెలిసికోవాలి. కాబట్టి దేవుడు పూజలు చేయించుకుంటూ కూర్చోలేదు. మానవుడు సాధించిన ప్రగతిలో వెనుక దేవుని అండదండలున్నాయనీ, ఆయన ఆజ్ఞ లేకపోతే చీమైనా కదలదని, అహంకారంతో మానవుడు నేను చేస్తున్నాననుకుంటున్నాడని మీ మిత్రుడితో మర్చిపోకుండా చెప్పండి.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥

(భగవద్గీత 15-22) ○○

---

**Life is an adventure with 98% perspiration and 2% inspiration.**

**సామాన్య మానవుని జీవితము నూటికి తొంభైయెనిమిది పాళ్లు వ్యర్థ ప్రయాసలతోను, రెండు పాళ్లు సార్థకకార్యములతోను గూడియున్న ఒకానొక ఆశ్చర్య సంఘటనయై యున్నది. (అట్లుకాక నూటికి నూరుపాళ్లు సార్థకములగు దైవ, పరోపకార కార్యములందే జీవితమును గడుపులాగున యత్నించవలెను.)**

# కాలం

## శ్రీమతి కె. విద్యావతి గారు (శ్రీకాళహస్తి)

జీవితంలో మనం ఏదైనా సాధించగలం, దేన్నైనా పొందగలం కాని జరిగి పోయిన కాలాన్ని తిరిగి పొందటం అనేది అసంభవం. ఈ ప్రపంచంలో అన్నింటికన్నా అతివిలువైనది కాలం. కాని మనం ఎక్కువగా దుర్వినియోగం చేసేదికూడా ఈ కాలాన్నే. గతించిన కాలం తిరిగిరాదు అని తెలిసి వృధాకాలక్షేపంచేస్తూ ఎంత కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నామోగదా! మనిషిగా పుట్టి అన్నీ తెలుసుకొనగలిగిన జ్ఞానం వుండి ఏం చేస్తున్నామో కూడా తెలియనంత అజ్ఞానంలో మనం బ్రతుకుతున్నాం. ఇది మన దౌర్భాగ్యం.

రోజులో ఎంత సమయాన్ని మనం సద్వినియోగం చేసుకుంటున్నాం? ఎంత సమయం భగవంతుని కొరకు వెచ్చిస్తున్నాం? ఎంత సమయాన్ని సత్కార్య ములు చేయటానికి వినియోగిస్తున్నాం? ఎప్పుడు ఏం జరుగునో కూడా తెలియని నమ్మకం లేని జీవితం మనది. అలాంటి జీవితాన్ని జీవిస్తూ దివ్యమైన ఈ జీవితాన్ని వృధాగా కాలక్షేపం చేస్తున్నాం అంటే నిజంగా క్షమించరాని నేరం చేస్తున్నాం అని చెప్పాలి.

ఇకనైనా మేలుకోవాలి. మేలుకొని ఇన్నాళ్ళ జీవితం చేజారిపోయిందే అని కన్నీళ్ళు పెట్టక ఇకముందు చేజారిపోకుండా జాగ్రత్తపడాలి, సాధనచేయాలి. భగ వంతుని ధ్యానిస్తూ, సత్కార్యములు చేస్తూ భగవంతునికి ప్రీతిపాత్రులం కావాలి. నిన్నటి దినం వృధా అయిందే అని దిగులుపడి ఈ దినాన్ని వృధాచేయకుండా ప్రతినిత్యం భగవంతుని మనస్సునందు జపిస్తూ ఎవరికినీ ఎటువంటి హాని తలపెట్టక ఇతరులను సైతం తనవలే చూస్తూ భగవంతుని సన్నిధిలో జీవించినంతకాలం ఈ జీవితాన్ని దివ్యజీవితంగా గడిపి జన్మను చరితార్థం చేసుకుందాం. ○○

---

No need of looking behind, March forward!

వెనుకకు చూడవలసిన పనిలేదు. ముందుకు కొనసాగుడు.

వేదాంతభేరి

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1. అమెరికాలోని కాలిఫోర్నియాలో సెక్వ్యాఓయా అను జాతి వృక్షము 325 అడుగుల ఎత్తు, 306 అడుగుల లావు కలిగి యుండును.

2. దక్షిణాఫ్రికాలోని చాట్స్‌వర్త్‌లో హరేకృష్ణ భక్తులు 1 కోటి రూపాయలతో దేవాలయమును నిర్మించిరి.

3. రష్యా దేశపు అంటోనోవ్ 124–విమానము ప్రపంచములో చాల పెద్దది. అదిగంటకు 840 కిలోమీటర్ల వేగముతో 16,500 కిలోమీటర్ల దూరము పోగలదు.

4. సూర్యుని చుట్టూ తిరుగుచున్న తొమ్మిది ఉపగ్రహములలో ఏడవది యురేనస్ శని గ్రహమునుండి 100 కోట్ల మైళ్ల దూరమున అది తిరుగుచున్నది.

5. మహారాష్ట్ర దేశములో లోనార్ దగ్గరవున్న ఉప్పునీటి సరస్సు ప్రపంచ ప్రసిద్ధమైనది. ఇది 75 వేల సంవత్సరములకు పూర్వము ఒక ఉల్కవలన ఏర్పడినదని భావించుచున్నారు. దీని లోతు 500 అడుగులు వైశాల్యము 6 కిలోమీటర్లు.

6. చైనాలో 3,765 మంది శతాధిక వృద్ధులు కలరు. వీరిలో రెండు వంతులు స్త్రీలు.

7. శని గ్రహము సూర్యుని చుట్టూ చాల నెమ్మదిగా తిరుగుచుండును. భూమి వేగములో మూడవ వంతు వేగము కలిగియుండును. అది 30 సంవత్సరముల కొక ప్రదక్షిణము పూర్తిచేయును.

○○



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

ఓ రామచంద్రా! సరస్వతీదేవి లీలాదేవికి ఇట్లు ప్రబోధించెను.

దేవి :- ఈ రెండు సృష్టులును మిథ్యయే. ఆత్మయే ఆయా విధముగ నచటను ఇచటను మాయచే ఆయా సృష్టి రూపమున భాసించుచున్నది.

లీల :- ఈ సృష్టినుండి భ్రమాత్మకమైన నా పతి సృష్టి యెట్లుత్పన్నమాయెనో వచింపుడు?

దేవి :- చిదాకాశమున ఆ జ్ఞానావృతభాగమున ఒకానొక చోట నొక జగన్మండపము గలదు. ఆ జగత్తునందొక చోట గిరి గ్రామమను పర్వతావృతమగు ఒక చిన్న గ్రామము కలదు. అందు పత్నీ పుత్ర సహితుఁడగు ఒక బ్రాహ్మణుఁడు గలడు. ఒకనాడా బ్రాహ్మణుడు పర్వత శిఖరముపైఁగూర్చొనియుండ క్రింద భాగమున భూమిపై సమగ్ర పరివార రథాది సమేతుఁడై వేటకేతెంచిన యొక రాజును జూచి తనలో 'నేనుగూడ నట్టి రాజత్వము నెపుడు పొందుదును' అని చింతింపసాగెను. పిదప కొంతకాలమున కా బ్రాహ్మణుఁడు మరణోన్ముఖుఁడు కాఁగా భార్య నన్ను (దేవిని) ప్రార్థించి మరణరహిత పదవి దుష్ప్రాప్యమని యెఱింగి నీవలెనే తన భర్త మరణానంతరమాతని జీవము తన యంతఃపురమునకు వెలుపల బోకుండులాగున వరము గైకొనెను. పిదప కాలవశమున నా బ్రాహ్మణుఁడు మరణింప పూర్వజన్మ సంకల్పబలముచే రాజై పుట్టి యా గృహాకాశముననే రాజ్యపాలన చేయుచు నుండెను. ఆ బ్రాహ్మణి పతితో గూడ మరణించి సూక్ష్మశరీరముతో నాతని చెంతకుఁబోయెను. ఆతడు మరణించి నేటికి 8 రోజులు. ఆతఁడే నీ భర్తయగు పద్ముఁడు.

దేవి యొక్క యా వాక్యములను విని లీల యాశ్చర్యపతియై చిన్ని గృహమండ

పమున నీ విశాల పర్వతాదియుక్త పృధిని ఎట్లుండగలడు? అని ప్రశ్నింప ఆమె యిట్లు వచించెను-స్వప్న సంకల్పాదులందలి ముల్లోకములవలె ఆ బ్రాహ్మణుని గృహమండపమున నీ ప్రపంచముగలదు. చిదాకాశమం దీ సృష్టిసమూహము అసత్యమైనను సత్యతుల్యముగ గానుపించుచున్నది. ఈ ప్రకారముగ చిదాకాశమున పరమాణు పరమాణువునందును అనేక బ్రహ్మాండములు గలవు. అపుడిది యొక ఆశ్చర్యమా! అట్లే కాలవిషయమునందును గ్రహించవలెను. స్వప్నమందువలె స్వల్పకాలము దీర్ఘకాలముగ భాసించును. వాస్తవముగ ఈ దృశ్యపదార్థమేమియును లేదు. అజ్ఞానముచేతనే జీవుడీ విధముగ పుత్ర మిత్రాది సంసారమును, జగత్తును వీక్షించుచున్నాడు.

లీల :- ఆ గిరిగ్రామమువద్దకు నన్ను గొంపోవుడు. వారలను వారి సృష్టిని జూచెదను.

దేవి :- దానిని గాంచుటకీ స్థూలదేహము అడ్డు. కాబట్టి దీనిని వీడి సమాధియందున్నచో ఆ సృష్టిని నిరాటంకముగా చూడవచ్చును. అనగా శుద్ధ చిద్రూపమగు బ్రహ్మమును బొందినచో, అత్తటి శుద్ధ చిత్తరూప దేహముచే దానిని జూడగలవు. నా దేహము శుద్ధ సత్వగుణయుక్తము గావున నేనీ దేహముతోనే తక్కిన మనోమయ ప్రపంచములను జూడగలను. చిరకాల భావనచే జనులకు స్థూలత్వ దేహబుద్ధి కలుగుచున్నది. కాబట్టి వాసనాసూక్ష్మత ద్వారా మరల సూక్ష్మత్వమును బొందవలసియున్నది.

లీల :- అయితే ఇంతకాలమువలకు ఈ వివిధ ద్వైతాది కల్పనలచే మమ్ము భ్రమపెట్టినదేది?

దేవి :- అజ్ఞానము, అయ్యది విచారణచే నశించును. అపుడు ద్వైత్వాదులు నశించి కేవలము బ్రహ్మసత్తయే శేషించును. వాసనలు క్షయింప రాగద్వేషాదులు నిర్మూలముకాగా నిర్వికల్పసమాధి లభించును. అత్తటి సంసారభావన నశించును. అదియే జీవన్ముక్త స్థితి.

లీల :- దానిని అభ్యసించుటెట్లు?

దేవి :- దృశ్యము యొక్క అత్యంతాభావముద్వారా రాగద్వేషాదులను సన్నగింపం జేసికొని వాసనలను నశింపజేసికొనుచు బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య అను భావనలను రూఢిపఱచుకొనుట అభ్యాసమనంబడును. దానిచే అజ్ఞానమను మహానిద్ర తొలగిపోయి జీవుడు మోక్షభాగుడగును.

వసిష్ఠమునీంద్రుడిట్లు బోధించుచుండ నింతలో సాయంసమయమైనందున సభ విరమింపబడెను.

OO

# వినోదము-వికాసము

## మారీచుని హృదయం

మారీచుడను రాక్షసుని యొక్క పరిచయం రామాయణ ప్రారంభ ఘట్టాలలో జనులకు కలుగుతుంది. అతడు తాటకి అను రాక్షసి యొక్క కుమారుడు, పరాక్రమ శీలుడు, విశ్వామిత్రుని యాగమునకు విఘ్నములు కలుగజేయదలంచిన రాక్షస కూటమిలో సభ్యుడు. విశ్వామిత్రుని యాగసంరక్షణ బాధ్యత శ్రీరాముడు గైకొనిన విషయము అందరికి తెలుసు. మారీచునిపై శ్రీరాముడు ప్రయోగించిన బాణముచే కొన్ని యోజనముల దూరము అతడు విసిరివేయబడి, సముద్రములో పడి ఎట్లాగో ప్రాణాన్ని కాపాడుకున్నాడు, బ్రతికి బయటపడ్డాడు. చావు తప్పి కన్ను లొట్టపోయినట్లైంది అతని పని.

మొదట్లో తప్పులు చేసినా వాటి ఫలితంగా పరాభవం పొందినా కొంత కాలానికి మారీచుడు మనస్సు మార్చుకున్నాడు. అతని హృదయంలో శుభ పరిణామం కలిగింది. అతడు సాధువృత్తిని అవలంబించి ఏకాంతంగా ఒక ఆశ్రమంలో ఉంటున్నాడు. సన్మార్గాన్ని చేబట్టాడు. రావణుడు అతని వద్దకు వచ్చి మాయా లేడి వేషం వేయమని అడిగినపుడు అతడు ఏమాత్రం అంగీకరించలేదు. సీతాపహరణం మంచిదికాదని, దానిని గూర్చిన తన ప్రయత్నం విరమించమని రావణునకు ఎన్నో బుద్ధులు చెప్పాడు. రాముని పరాక్రమం గూర్చి వారి శక్తి సామర్థ్యాలు గూర్చి ఎంతయో పొగిడాడు.

రాముని చూచి తాను భయపడుచున్నానని, ఇంతేకాదు రాముని పేరులో ఉన్న మొదటి అక్షరమైన 'ర' కారముతో ప్రారంభించే రథం, రత్నం మొదలైన పదాలు విన్నప్పుడు కూడ అతనికి ఎంతో భయం కలుగుతుందని, అట్టి మహాశక్తిశాలితో విరోధం పెట్టుకోవద్దని నచ్చజెప్పాడు. కాని అతని మాటలను రావణుడు పెడచెవిని పెట్టాడు. మాయాలేడి వేషం వేయకపోతే చంపేస్తానని బెదిరించాడు. అపుడు

# పరమార్థ సూక్తులు



- దేవుడు అన్ని ప్రాణుల రూపమున నీ ముందే ఉన్నాడు.
- ఏమి చేయవలెను అనునదియే ముఖ్యము. ప్రజలు ఏమనుకొందురో అనికాదు.
- భగవంతుని దర్శింపజేయు విద్యయే నిజమైన విద్య.
- ఆపత్తులందు ధైర్యమును చూపువాడే వీరుడు.
- ఇతరులను జయించువాడు విజేత. తన్ను తాను జయించుకొనువాడు మహావిజేత.
- కోరికలు తగ్గినకొలది దేవునకు మనము చేరువ అగుదుము.
- కష్టము ఎంత గొప్పదైతే దానిని అధిగమించుటవలన కలుగు ఘనత అంత ఎక్కువగా నుండును. ○○

---

మారీచుడు మలినహృదయుడగు రావణుని చేతిలో చచ్చేబదులు, పవిత్ర హృదయుడగు రాముని చేతిలో అసువులు బాయుట మంచిదని నిర్ణయించుకొని రావణుని ఆజ్ఞను బలవంతంగా అంగీకరించాడు.

మారీచుడు ప్రారంభంలో కొన్ని తప్పులు చేసినా తరువాత తన చరిత్రను సరిదిద్దుకొన్నాడు. రాక్షసకృత్యాలను విరమించాడు. సాధువృత్తిని అవలంబించాడు. ప్రతిపక్షంలో ఉన్న ఒక రాక్షసుడే తన జీవితాన్ని మార్చుకొన్నప్పుడు ఇక తక్కినవారు ఎందుకు మార్చుకొనకూడదు? ప్రతి జీవియు అజ్ఞాన స్థితిలో ఎట్లా ఉన్నా, ఎట్లా ప్రవర్తించినా క్రమంగా పెద్దల సహవాసంచేసి మంచి మార్గంలో పయనించి హృదయంలో సత్పరిణామం కలుగజేసుకొని జీవితాన్ని పవిత్రమయంగా ఒనర్చుకోవాలి. అట్లు చేసుకోకపోతే జన్మ నిరర్థకం.

కావున జీవుడా! చెడ్డమార్గాలను వదలిపెట్టు, సన్మార్గాన్ని చేబట్టు. దుర్గుణాలకు తిలాంజలి ఇచ్చెయ్. సద్గుణాలకు స్వాగతం పలుకు. రామభక్తిని పెంచుకో! దైవభక్తిని ద్విగుణీకృతం చేసుకో!! జన్మసార్థకతను పొందు!!! జై గురుదేవ్.

*రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ।*
*రత్నాని చ రథాశ్చైవ విత్రాసం జనయన్తి మే॥* (రామాయణము) ○○



# వేదాంత గోష్ఠి

## నేటి చర్చనీయాంశము–మహాబంధము

**శిష్యుడు** (శివప్రసాద్) – స్వామీ! గురుదేవా! క్రిందటిసారి గోష్ఠిలో ముముక్షుత్వాన్ని గూర్చి తమరు విశదీకరించారు. మోక్షమును గూర్చి తీవ్ర వాంఛయే, తీవ్ర అభిలాషయే ముముక్షుత్వమని తమరు సెలవిచ్చారు. అయితే స్వామీ! కొందరిట్లా ప్రశ్నిస్తున్నారు?–"మాకీ ప్రపంచం ఎంతో హాయిగా ఉంది. పిల్లా మేక, ఇల్లూ వాకిలి, ధనము ధాన్యము అన్నీ చక్కగ ఉన్నాయి. ఇక మాకు మోక్షంతో ఏమి పని? మోక్షమంటే విడుదలకదా! మేము బంధింపబడియుంటేకదా విడుదలకు ప్రయత్నము చేసేది. కాబట్టి మోక్షము యొక్క ఆవశ్యకత ఏమి?"– గురుదేవా! కొందరి ప్రాపంచిక మనుజుల యొక్క ఈ అభిప్రాయాలను గూర్చి తమ ప్రతిస్పందన ఏమిటో వినాలని కుతూహలంగా ఉన్నాను. తమరు అనుభవజ్ఞులు, అన్ని విషయాలు సాంగోపాంగంగ తెలిసినవారు. కావున తమ సమాధానం నా జీవిత పురోగమనానికి లెస్సగ ఉపకరిస్తుందని తలుస్తున్నాను. సమాధానమివ్వ ప్రార్థన.

**గురువు (ప్రబోధానందస్వాములవారు)** – నాయనా! శివప్రసాద్! ప్రపంచ వాసుల యొక్క నాడిని నీవు బాగా పట్టి చూచావు. నీవు చెప్పిన మాటలు నిజమే. అజ్ఞానంవల్ల, ఆధ్యాత్మికానుభవం లేనందువల్ల కొందరు ఏవేవో చెప్తుంటారు, సత్యమును వక్రీకరిస్తూంటారు. కాబట్టి ముముక్షువులు, జిజ్ఞాసువులు, పరమార్థ విద్యాపిపాసువులు ఈ విషయమై కడు జాగరూకత వహించి శాస్త్రాల యొక్కయు, అనుభవజ్ఞులైన మహాత్ముల యొక్కయు భావాలను చక్కగా గ్రహించి ఆచరణయందుంచి తరించాలి. అంతేగాని దారిపోయేవారి మాటలు విని చెడిపోగూడదు.

ఇక అసలు విషయంలోకి వస్తాం. ఇపుడు మోక్షం కొరకు అందరూ ఎందుకు ప్రయత్నం చేయటంలేదంటే, తాము బంధనంలో ఉన్నామని వారు తెలుసుకొనలేక పోతున్నారు. "మేము హాయిగా ఉన్నామ"ని అంటున్నారేగాని ఆ హాయి యొక్క పరిమితి ఎంత? అది ఎంత కాలం ఉంటుంది. ఆ హాయిలో ఏమైనా అపశ్రుతి

కలిసిందా? దుఃఖం మిళితమై యుందా? అని వారు ఏమాత్రం ఆలోచించటంలేదు. ప్రపంచంలో ధనవంతుడుగాని, అధికారవంతుడుగాని, సౌందర్యవంతుడుగాని, మహాసంపన్నుడుగాని అనుభవించే సుఖం సుఖం కాదు. అది ప్రతిబింబ సుఖం, దుఃఖ మిశ్రితసుఖం, చంచల సుఖం, మూణ్ణాళ్ళ ముచ్చట. మోహకారణమున అదే గొప్పదని తలంచి విషయ భోగాలే మహాసుఖదాయకములని ఎంచి వాటి వెంట జనులు పరుగెత్తుచున్నారు. వారి సుకం సుఖం కాదు. వారి హాయి హాయికాదు, వారి ఆనందం ఆనందం కాదు. ఎప్పటికైనా వారు దుఃఖాన్ని ఎదుర్కొనక తప్పదు. ఈ విషయాన్ని ప్రజలు ఎంత త్వరగా గమనిస్తే అంత మంచిది.

ప్రపంచంలో పూర్ణసుఖాన్ని ఇచ్చేది ఒక్క ఆత్మయే, దృశ్యవిషయాలు కావు. దృశ్యం ఎంత గొప్పదైనా తీసికట్టే. కావున విజ్ఞుడైనవాడు ప్రాపంచిక జనుల వాక్యాలను పెడచెవినపెట్టి విషయభోగాల ఎడల విరాగం కలిగి, ఆత్మను బడయుటకై పెక్కు సాధనలు గావించి ధన్యుడు కావలెను.

ఈ ప్రపంచము ఎంత ఆనందంగ కనిపించినా సంసారం ఎంత రుచికరంగా తోచినా క్షణికమైనది కాబట్టి రేపో, మాపో అదృశ్యమై పోతుంది కాబట్టి దీనిని నమ్మి, దీనిని వెంటాడి జీవితాన్ని నిరుపయోగం చేసుకోవటం మంచిదికాదు. ఈ ప్రపంచంలో దేశము, కాలము, క్రియ అను మూడిటిచేత జీవుడు బంధింపబడుతున్నాడు. 'దేశమనగా ఆకారము. మనుజుడు ఆకారముచేత బద్ధుడు (పరిమితాకారము కలవాడు), కాలముచేత బద్ధుడు (కొద్ది సంవత్సరముల జీవితమే కలవాడు), కర్మచేత బద్ధుడు (తన పూర్వకర్మలకు లోబడియుండేవాడు). ఈ మూడిటిచేత బద్ధుడైయున్నవాడు ఇక ఏ పూర్ణసుఖాన్ని నోచుకొంటాడు. కావున ఈ **మహాబంధనం** నుండి జీవుడు తప్పించుకోవాలి. అట్లు తప్పించుకోవటానికి చేసే ప్రయత్నమే మోక్షయత్నం. కాబట్టి విజ్ఞులైనవారు ఈ ప్రాపంచిక సౌఖ్యాలను గొప్పగా తలంచక బ్రహ్మానుభూతియను మోక్షస్థితికై అనవరతము కృషిచేయుచు, మరల చావు పుట్టుకలేకుండా పరమానందమును బడయవలెను. నాయనా! శివప్రసాద్! పామరుల మాటలు వినవద్దు. మహర్షుల వాక్యాల ఎడలనే శ్రద్ధ కలిగియుండు. మోక్షం కొరకే తీవ్రతర యత్నం ఆచరించు. బంధవిముక్తుడవు కా. తరించు.

**శిష్యుడు** —గురుదేవా! ఎంతటి గొప్ప రహస్యాన్ని తమరు తెలియజేశారు! ఇక అజ్ఞానుల మాటలను నేను విననే వినను. తమరు బోధించిన ప్రకారమే ఋషిసత్తముల యొక్క పవిత్ర వాక్యములను ఆచరణయందుంచి, ఈ సంసారమను మహాబంధనము నుండి ముక్తుడగుటకై తీవ్రయత్నమాచరిస్తాను. దయయుంచండి. సెలవు. ○○

# ఓ మనస్సా! వినుము

రామ రామా యనుచు
నిరతంబు మదిలోన
స్మరణ చేయుము ఓయి మనసా
　　పరమ పావనమైన
　　దైవనామముచేత
　　పాపమంతయు తొలగు మనసా

జీవితంలో మానవుడు ఎన్నో పాపకార్యాలను ఆచరిస్తూ, ఆ పాపఫలితమగు దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. ప్రపంచంలో ఒక చండశాసనం ఉంది. ఆ ధర్మశాసనాన్ని అనుసరించే ఈ ప్రపంచం నడుస్తూంది. "పాపముచే దుఃఖం, పుణ్యంచే సుఖం, జ్ఞానంచే మోక్షం"-అను ఈ సిద్ధాంతమే విశ్వమందలి శాసనం. పాపమును ఎవరు చేసినా విశ్వశాసనాన్ని అనుసరించి వాడు దుఃఖాన్ని అనుభవించాల్సిందే. పుణ్యకార్యాచరణ చేసినవాడు ఆత్మజ్ఞానం పొందినవాడు విశ్వశాసనానుగుణంగా సుఖం అనుభవిస్తున్నాడు. పాపకార్యం చేయుటద్వారా దుఃఖాన్ని కొనితెచ్చుకోవటం మంచిదికాదు.

పుణ్యముచే పాపము తొలగిపోవును. కావున ఎన్నో జన్మలనుండి అజ్ఞానవశంచేత పాపాన్ని కూడబెట్టుకొనిన మానవుడు, ఈ జీవితంలో ధర్మకార్యాలను ఆచరించి, పవిత్రములగు భగవన్నామములను ఉచ్చరించి ఆ పాపాన్ని పోగొట్టుకోవాలి. పాపము ఉండుటవలన చిత్తశుద్ధి కలుగదు. చిత్తశుద్ధి లేనిచో జ్ఞానం ఉదయింపదు. జ్ఞానం ఉదయింపనిచో మోక్షము సంభవింపదు. కనుక భగవన్నామోచ్చారణ ద్వారా, పుణ్యకార్యాచరణద్వారా జ్ఞానసంపాదనద్వారా మానవుడు తన పూర్వసంచిత పాపాన్ని పోగొట్టుకొని మరల ఏమాత్రము పాపం చేయక ధర్మమార్గాన పయనించాలి. తరించుటకు మార్గమదే.

కావున ఓ మనస్సా! రామ రామ అనియు, కృష్ణ కృష్ణ అనియు, శివ శివ అనియు భగవన్నామాన్ని భక్తిపూర్వకంగ ఉచ్చరిస్తూ పాపాన్ని పోగొట్టుకో. భగవదనుగ్రహంచే జ్ఞానం పొందు. హృదయాన్ని పవిత్రంగా ఉంచుకో. జీవితాన్ని ఆనందమయంగా చేసుకో. ౧౧

# మీకు తెలుసా?

1) అష్ట లక్ష్ములు—

1. ధనలక్ష్మి, 2. ధాన్యలక్ష్మి, 3. జయలక్ష్మి, 4. బలలక్ష్మి, 5. ధైర్యలక్ష్మి, 6. రాజ్యలక్ష్మి, 7. ఐశ్వర్యలక్ష్మి, 8. మోక్షలక్ష్మి.

2) ఆమ్లపంచకము (పులుపు పండ్లు ఐదు రకములు) –

1. రేగు, 2. దానిమ్మ, 3. చింత, 4. పులిచింత, 5. పుల్ల ప్రబ్బలి,

1. నిమ్మ, 2. నారింజ, 3. పుల్లప్రబ్బ, 4. చింత, 5. మాదీఫలము.

3) అష్టవిధ లోహములు –

1. బంగారు, 2. వెండి, 3. రాగి, 4. ఇనుము, 5. తగరము, 6. సత్తు, 7. సీసము, 8. కంచు.

4) అక్షిత్రయము – అక్షి అను పేరు చివరగల జగన్మాతకు మూడు పేర్లు గలవు. అవి ఏవనగా–

1. కంచి కామాక్షి, 2. మధుర మీనాక్షి, 3. కాశీ విశాలాక్షి.

5) సప్తదశ ద్వీపములు (17 ద్వీపములు) –

1. రమ్యకము, 2. రమణకము, 3. ద్వారక, 4. సింహళము, 5. కైవల్యము, 6. మలయము, 7. అశ్వభద్రము, 8. కేతు, 9. మాల్యవంతము, 10. పుష్కరము, 11. ఋషభము, 12. రైవతము, 13. విమ్లోచనము, 14. వియామ్యము, 15. పారావారము, 16. చౌరకృతము, 17. మాల్యము.



Stand up! Assert yourself. Proclaim the God within you.

లెమ్ము! నీ నిజస్వరూపమును తెలుసుకొనుము. నీలోని దైవత్వమును చాటుము.

# వరలక్ష్మీ వ్రతం

## శ్రీ కోకా శారద గారు (కర్నూలు)

'వ్రతానాముత్తమ వ్రతం' అని వరలక్ష్మి వ్రతాన్ని పౌరాణికులు శ్లాఘించారు. హిందువులకు ఎన్నో వ్రతాలున్నా అన్ని వర్గాల స్త్రీలచే ఆదరంతో ఆచరించబడేది వరలక్ష్మి వ్రతం. శ్రీ మహాలక్ష్మి యొక్క అనేక రూపాల్లో వరలక్ష్మి రూపం ఒకటి.

వరాలనిచ్చే లక్ష్మి వరలక్ష్మి. సంసార సాగరంలో మునిగిన స్త్రీలు తమ కుటుంబ సంక్షేమం కోసం పూజలు, వ్రతాలు చేయడం పరిపాటి. సంతానం కోసం, సౌభాగ్యం కోసం, భోగభాగ్యాల కోసం ఈ వరలక్ష్మి వ్రతం ఉద్దేశించబడింది.

హైందవ స్త్రీలకు శ్రావణ మాసం ఒక ప్రత్యేక మాసం. అది వారికి పూజల మాసం, పేరంటాల మాసం, నగల మాసం, శనగల మాసం. అందుకే దాన్ని స్త్రీల మాసంగా కూడా పిలుస్తారు. పట్టుచీరల రెపరెపలతో, నగల మెరుగులతో ప్రతి ఇల్లు కళకళలాడుతూ లక్ష్మీదేవి తాండవిస్తున్నట్లుంటుంది.

శ్రావణ మాసంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం అంటే రెండవ శుక్రవారం వరలక్ష్మి వ్రతం వస్తుంది. వరలక్ష్మి వ్రతమే కాక శ్రావణ మంగళవారాలు, శ్రావణ శుక్రవారాలు, శ్రావణ పౌర్ణమి అంటే రాఖీ పౌర్ణమి అన్నీ శ్రావణ మాసంలో ప్రత్యేక దినాలే. ఈ మాసంలో ముఖ్యంగా లక్ష్మీదేవిని, గౌరీదేవిని ఎక్కువగా పూజిస్తారు. స్త్రీల కొంగు బంగారమై, స్త్రీలచే విశేషంగా ఆచరించబడుతున్న వరలక్ష్మి వ్రతాన్ని గూర్చి తెలుసుకుందాం.

వరలక్ష్మి వ్రతం రోజు స్త్రీలు ఉదయాన్నే లేచి స్నానాదులు ముగించి, క్రొత్త వస్త్రాలు ధరిస్తారు. మంటపం ఏర్పాటుచేసి, మంటపం మధ్యలో కలశం పెడతారు. కలశంలోని టెంకాయకు వరలక్ష్మీదేవి ముఖాన్ని (వెండి లేదా బంగారు ప్రతిమను) అమర్చి నగలతో, పూల జడతో అలంకరిస్తారు. మంటపానికి అరటి స్తంభాలు, మామిడాకులు కడతారు. మంటపం చుట్టూ ముగ్గులు వేస్తారు. ప్రసాదాలు, పూలు, పండ్లు సిద్ధంచేసుకొని పూజ ప్రారంభిస్తారు.

వరలక్ష్మీదేవిని ఆవాహనచేసి షోడశోపచారాలతోను, అష్టోత్తర లేక సహస్ర నామాలతోను పూజిస్తారు. తర్వాత చేతికి తోరం (దారానికి పసుపు రాసి 8 పొరలుగా చేసినది) కట్టుకుంటారు. పూజానంతరం వ్రతకథ వింటారు. బ్రాహ్మణులచేత ఆశీ ర్వాదాలు పొందుతారు. నైవేద్యం పెడతారు.

పేరంటాళ్లకు పసుపు కుంకుమలిచ్చి ప్రసాదం, నానబెట్టిన పచ్చి శనగలు తాంబూలాలిస్తారు. ప్రసాదంగా కేసరి లేదా ఆవిరి కుడుములు చేస్తారు. అందరూ కలిసి వరలక్ష్మీదేవికి హారతులిచ్చి తమ కోరికలు నివేదించుకొని వ్రత సమాప్తి చేస్తారు. సాయంత్రం మళ్లీ పేరంటం చేసి హారతి ఇస్తారు.

కొన్ని ప్రాంతాల్లో ఒక ముత్తైదువను వరలక్ష్మీదేవిగా భావించి, భోజనం శక్తి కలవారు చీర లేక రవికల గుడ్డ పెట్టి పిండివంటలు ఆమెకు వాయునంగా ఇచ్చే ఆచారం ఉంది. కొందరు పూజారికి నూతన వస్త్రాలను బహూకరించి, వారి ఆశీర్వాదాలు పొందుతారు.

మగధ దేశంలోని చారుమతి అనే స్త్రీకి వరలక్ష్మీదేవి కలలో కనిపించి ఆ వ్రతాన్ని, వ్రత విధానాన్ని తెలుపగా, ఆమె తనేకాక తన ఊరిలోని స్త్రీలందరిచేతా ఈ వ్రతం చేయించింది. వ్రత ఫలితంగా వారికి దేవి అనుగ్రహంతోపాటు సకలైశ్వ ర్యాలు లభించాయి. కాబట్టి వ్రతానంతరం భక్తితో ఈ చారుమతి కథను వినడం ఆనవాయితీ.

పూర్వం శంకరుడు పార్వతికి చెప్పిన ఈ వ్రత విధానాన్ని సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు. స్త్రీలు సకలైశ్వర్యాలు పొంది, సంపూర్ణులై ఉండేందుకు ఆచరించదగ్గ వ్రతంగా ఈ వరలక్ష్మి వ్రతాన్ని చెప్పడంచేత ఈ వ్రతం ఎంతో ప్రాముఖ్యం పొందింది. ఈ వ్రతాన్నాచరించే పార్వతీదేవి కుమారస్వామిని పొందిం దని, నందుడు, విక్రమాదిత్యుడు మొదలగు రాజులు రాజ్యాలు పొందారనీ కథలు ప్రచారంలో వున్నాయి.

"సిద్ధలక్ష్మీః మోక్షలక్ష్మీః జయలక్ష్మీః సరస్వతీ
శ్రీ లక్ష్మీః వరలక్ష్మీ శ్చ ప్రసన్నా మమ సర్వదా"

అంటూ ఆ వరలక్ష్మిని ప్రార్థించి, ఆ దేవి అనుగ్రహానికి అందరూ పాత్రులగుదురుగాక! OO

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు

## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు

'త చందా రు. 300/-లు

1. శ్రీ జి. సాంబశివరావు గారు – విజయవాడ
2. శ్రీ కృష్ణస్వామి గారు – సికింద్రాబాద్
3. శ్రీ పి. సత్య సూర్యనారాయణ గారు – బుడితి
4. శ్రీ టి. కృష్ణమూర్తి గారు – విజయవాడ
5. శ్రీ టి.ఎస్. లక్ష్మి గారు – షిమోగ (కర్ణాటక)
6. శ్రీ ఎన్. కృష్ణారెడ్డి గారు – షాద్‌నగర్
7. శ్రీ లొల్ల తాతారావు స్మారక గ్రంథాలయము – రాజమండ్రి
8. శ్రీ సహజమండే ఆశ్రమము – ఆమ్రెడ్
9. శ్రీ వి. చిన్న సత్యనారాయణ గారు – బుడితి
10. శ్రీ వేంకటేశ్వర ఐరన్ స్టోర్స్ – కొయ్యలగూడెం
11. శ్రీ పి. యర్రయ్య గారు – లాంగ్టింగ్
12. శ్రీ పి. విశ్వనాథన్ గారు – మంజూర్
13. శ్రీ ఎమ్.వి.సి. సత్యనారాయణ గారు – మల్లీపల్లి
14. M/s ఒమెగ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ – తిరుపతి
15. శ్రీ పి. శశిధర సత్యం గారు – కర్నూలు
16. శ్రీ భీమ బాలస్వామి గారు – క్రొత్తపేట
17. శ్రీ పి.ఎల్.ఎన్. శాస్త్రి గారు – విజయవాడ
18. శ్రీ బి. సాయగౌడ్ గారు – కామారెడ్డి

Purity, Patience and Purseverence are the three essentials to success.

పవిత్రత, సహనము, పట్టుదల అను ఈ మూడును విజయమునకు ప్రధానమైన హేతువులు.






భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి నిమిత్తమై [illegible] మూలధనముగ ఒసంగబడిన విరాళములు–

## A విదేశీయుల నుండి

| | | | డాలర్లు | రూపాయలు |
|---|---|---|---|---|
| 1. | శ్రీ పి. రావు గుమ్మడి గారు | ఫోర్ట్లైన్(అమెరికా) | 400 | 11,200 |
| 2. | శ్రీ సీతారామయ్య ఎ. గారు | " | 400 | 11,200 |
| 3. | శ్రీ డా॥ వేంకట కనుబాడి గారు | " | 500 | 14,000 |
| 4. | శ్రీ డా॥ ఎస్.ఆర్. కనగాల గారు | " | 408 | 11,424 |
| 5. | శ్రీ డా॥ రవీంద్రనాథ్ గారు | " | 408 | 11,424 |
| 6. | శ్రీ భాను&సుధ కనకమేడల గార్లు | " | 500 | 14,000 |
| 7. | శ్రీ డా॥ జానకిరామయ్య కాకరాల గారు | " | 500 | 14,000 |
| 8. | శ్రీ దర్భా శాస్త్రి గారు (అన్న దానమునకు) | కెనడా | 600 | 16,800 |

## B స్వదేశము నుండి

| | | | రూ. |
|---|---|---|---|
| 1. | శ్రీ వబ్బిలిశెట్టి సూర్యారావు గారు | విశాఖపట్టణం | 11,116 |
| 2. | శ్రీ ఆర్.వి. రత్నమ్మ గారు | మద్రాస్ | 11,116 |
| 3. | శ్రీ పి. వుల్లన్న గారు | ప్రొద్దుటూరు | 11,116 |
| 4. | శ్రీ వై. తిరుపతిరావు గారు | కోరుట్ల | 11,116 |

| | | | |
|---|---|---|---|
| 5. | శ్రీ ఆత్మకూరు నాగభూషణం శెట్టి గారు | నంద్యాల | 11,116 |
| 6. | శ్రీ లగిశెట్టి నాగిశెట్టి గారు | నంద్యాల | 11,116 |
| 7. | శ్రీ ఎమ్. అప్పారావు గారు | విశాఖ | 11,116 |
| 8. | శ్రీ జె.వి. కృష్ణారావు గారు | విజయవాడ | 11,116 |
| 9. | శ్రీ భగవద్గీత అధ్యయన మండలి | మంచిర్యాల | 11,116 |
| 10. | శ్రీ పాచోలు నరసింహారావు గారు | బి. దొడ్డవరం | 11,116 |
| 11. | శ్రీ ఎన్. కృష్ణమూర్తి గారు | | 11,116 |

విరాళములు పంపదలంచినవారు ఈ క్రింది అడ్రసుకు పంపవచ్చును.

సెక్రెటరి, శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి - 517 640
చిత్తూరు జిల్లా.

OC

I believe in the absolute oneness of God and therefore of humanity. What though we have many bodies? We have but one soul. The rays of the Sun are many through refraction. But they have the same source.

దేవునియొక్క పరిపూర్ణ ఏకత్వమునందు, అట్లే మానవు లందరియొక్క ఏకత్వమునందు నాకు నమ్మకము కలదు. మనకు వేర్వేరు దేహములున్ననేమి? మనకు ఆత్మ ఒకటియే కలదుగదా! సూర్యుని కిరణములు అనేకములైనను సూర్యు డొక్కడేగదా! (గాంధిమహాత్ముడు)

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram,
Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

# నారద భక్తి సూత్రములు–79

## సర్వదా సర్వభావేన నిశ్చిన్తైర్భగవానేవ భజనీయః

*తా॥ భక్తుడు ఇతర చింతలు, తలంపులు లేక సర్వకాల సర్వావస్థలయందును సర్వభావముతో భగవంతునే భజించవలెను, ధ్యానించవలెను.*

వ్యాఖ్య :–భక్తుడగువాడు ప్రాపంచిక విషయములందును, దృశ్య వ్యవహారములందు మనస్సును ప్రవేశింపనీయక, ఏ ఇతర చింతలుకాని, తలంపులుకాని లేక, సర్వభావము తో, అనగా పరిపూర్ణ హృదయముతో, నిండు మనస్సుతో భగవంతునే సేవించవలెను, భజించవలెను. ఆరాధించ వలెను, ధ్యానించవలెను. దైవచింతనయందు ఏకాగ్రత అవసరము. సాధకుడు అనన్యభావముతో, అనన్య భక్తితో భగవంతుని భజించవలెను.

భక్తుని మనస్సు దృశ్యవిషయములందు విభక్తము కారాదు. పరిపూర్ణముగ దేవునియందే లగ్నము కావలెను. భక్తుడు ఏ చింతయులేక, ఏ తలంపులు లేక కేవలము దైవా యత్త చిత్తుడై పఱగవలెను. ప్రపంచదృష్టి లేక సర్వత్ర దైవదృష్టియే కలిగియుండవలెను. ఈ ప్రకారముగ సర్వ కాలములందును, సర్వావస్థలయందును భగవద్భక్తి మయుడై, తన్మయుడై విరాజిల్లు భక్తుడు భగవత్కృ పకు పాత్రుడై పరమశాంతిని, పరమానందమును అనుభ వించును.

ఓం